# జరిగిందేదో జరిగింది

## ఇంటి పని తేలిక

## అనుకున్న మనిషి కథ



వాండా గేగ్

# జరిగందేదో జరిగింది

## ఇంటి పని తేలిక

## అనుకున్న మనిషి కథ



ఇది చాలా పురాతనమైన కథ. నేను చిన్నగా ఉన్నప్పుడు మా నాయనమ్మ నాకు ఈ కథ చెప్పింది. మా నాయనమ్మ చిన్నగా ఉన్నప్పుడు ఈ కథను ఆమెకి వాళ్ల అవ్వ చెప్పింది. ఆ అవ్వ చిన్నగా ఉన్నప్పుడు బొహెమియాలో ఈ కథను వాళ్ల అమ్మ చెప్పింది. ఆమె ఈ కథని ఎవరి నుంచి విన్నదో నాకు తెలియదు. కానీ, ఇదైతే చాలా పురాతనమైన కథ. మా నాయనమ్మ నాకు ఈ కథని ఇలా చెప్పింది. దాని పేరు

జరిగిందేదో జరిగింది...

# జరిగిందేదో జరిగింది

## ఇంటి పని తేలిక

## అనుకున్న మనిషి కథ



అతడి పేరు ఫ్రిజల్.

అతడి భార్య పేరు లిజీ.

వాళ్లకి ఒక చిన్న పాప.

ఆమె పేరు కందిలి.



వాళ్ల కుక్క పేరు స్పిట్జ్.

వాళ్లకి ఇంకా ఒక ఆవు, రెండు మేకలు,

మూడు పందులు, పన్నెండు బాతులు ఉన్నాయి.

వాళ్లకి ఒక గుడిసె,

వ్యవసాయం చేసే కొంత భూమి ఉన్నా .

వాళ్లకి ఉన్న సంపద ఇదే.



ఫ్రిజల్ పొలం దున్నేవాడు, విత్తనాలు
విత్తేవాడు, కలుపు తీసేవాడు. జనుము కోసి,
ఎండబెట్టి కట్టలు కట్టి నిల్వ చేసేవాడు. అలా
అతడు ప్రతి రోజూ ఎంతో కష్ట పడేవాడు.



ఇంటి దగ్గర లిజీ ఇల్లు శుభ్రం చేసేది, వంట
చేసేది, వెన్న చిలికేది, కొట్టం శుభ్రం చేసి
పశువులను, బాతులను చూసుకునేది,
పాప కందిలిని కూడా చూసుకునేది. లిజీ
కూడా రోజంతా చాలా కష్టపడేదని మీకు
అర్థమౌతూనే ఉంది.

భార్యా, భర్తలు ఇద్దరూ చాలా కష్టపడేవారు. కానీ ఫ్రిజల్‌కి తాను ఎక్కువ కష్టపడుతున్నాడని అనుకునేవాడు. సాయంత్రాలు పొలం నుంచి తిరిగి వచ్చిన తరవాత ముఖాన్ని ఎర్రటి తుండుతో తుడుచుకుంటూ, "ఇవ్వాళ ఎంత ఎండగా ఉంది. నేను చాలా కష్టపడ్డాను. మగవాళ్ల పని ఎంత కష్టమో నువ్వు ఊహించను కూడా ఊహించలేవు, లిజీ! దాంతో పోలిస్తే నువ్వు చేసే పని అసలు పనే కాదు!"

"ఇంటి పని అంత తేలిక ఏమీ కాదు," చెప్పింది లీజీ.

"ఇంటి పని కూడా కష్టమే అంటావా," ఫ్రిజల్ అరిచాడు. "నీడపట్టున అటూ, ఇటూ తిరిగితే నీ పని అయిపోతుంది. ఇంటి పని ఏమంత కష్టం కాదు."

లిజీ అతడితో ఏకీభవించలేదు.



"ఇంటి పని తేలిక అని నువ్వు అనుకుంటే
రేపు మనం మన పనులను మార్చుకుందాం.
నేను నీ బదులు పొలం వెళ్లి పొలం పనులు
చేస్తాను. నువ్వు నా బదులు ఇంటి దగ్గర
ఉండి ఇంటి పనులు చక్కపెట్టు. అలా
చెయ్యటం నీకు ఇష్టమేనా?"



ఫ్రిజల్‌కి ఆ ప్రతిపాదన నచ్చింది. నీడపట్టున ఉండి
ఆడుకుంటూ ఉండే కందిలి మీద ఒక కన్నేసి ఉంచాలి,
ఇంట్లో కూర్చుని వెన్న చిలకాలి, అన్నం, కూరలు
వండాలి, అంతేగా. ఇదంతా చాలా తేలికగా చెయ్యవచ్చు!
సంతోషంగా తన పనిని తన భార్య పనితో
మార్చుకుంటాడు!



మరునాడు ఉదయం లిజీ ఆలస్యం చెయ్యకుండా నీటి బుర్ర, కొడవలితో పొలం పనికి వెళ్లింది.

ఆ సమయంలో ఫ్రిజల్ ఏం చేస్తున్నాడు? నాస్తా కోసం పకోడీలు వేయించుతున్నాడు. మూకుడులో పకోడీలు కాలుతూ ఉండగా అతడు కమ్మని ఊహలలో మునిగిపోయాడు.

“నాస్తాతో కొంచెం యాపిల్ సారాయి
పుచ్చుకుంటే ఆ మజాయే వేరు,”
అనుకోసాగాడు.

అనుకున్నదే తడవుగా అందుకు
పూనుకున్నాడు.

మూకుడుని పొయ్యి మీద నుంచి తీసి
పక్కన పెట్టి, సారాయి కోసం నేల మాళిగలోకి
వెళ్లాడు. సారాయి పీపా బిరడా తీశాడు.



సారాయి లోటాలో పడుతూ ఉంటా ఆ
శబ్దాన్ని ఆస్వాదిస్తూ ఉన్నాడు, ఆ
నురగను చూసి సంతోషిస్తున్నాడు.

అయ్యో! వంటింటిలోంచి ఆ శబ్దాలు ఏమిటి?
కుక్క స్పైట్జ్ పకోడీలు తినటం లేదు కదా?
అవును, అదే అయ్యుంటుంది! ఫ్రిజల్ మెట్లు
ఎక్కి వంటింటిలోకి వచ్చేసరికి స్పైట్జ్ పకోడీలను
నోట కరుచుకుని బయటకు పరిగెత్తుతోంది!

"హేయ్! హేయ్!" అంటూ

కుక్క వెంట పడ్డాడు ఫ్రిజల్.





స్పిట్జ్ ఆగకుండా పరిగెత్తింది, ఫ్రిజల్ దాని
వెనక పరిగెత్తాడు. స్పిట్జ్ వేగంగా పరిగెత్తింది,
ఫ్రిజల్ కూడా వేగంగా పరిగెత్తాడు. కానీ
ఫ్రిజల్ ఓడిపోయాడు, స్పిట్జ్‌ని
పట్టుకోలేకపోయాడు.



“పోయిందేదో పోయింది, వదిలెయ్!” అంటూ
ఫ్రిజల్ ఇంటికి తిరిగి వచ్చాడు. ముఖానికి
పట్టిన చెమటని ఎర్ర తుండుతో
తుడుచుకున్నాడు.



అంతలో అతడికి మరొక విషయం గుర్తుకు వచ్చింది - సారాయి పీపా మూత మళ్లీ పెట్టాడా? లేదు, దాని బిరడా ఇంకా అతని చేతిలోనే ఉంది.

చాలా వేగంగా ఇంటికి పరిగెత్తాడు. కానీ, ఆపాటికే జరగాల్సింది జరిగిపోయింది.



అతడి లోటా సారాయితో నిండిపోవటమే కాదు,
నేలమాళిగ కూడా మడుగుగా మారింది.
సారాయి పీపా దాదాపుగా ఖాళీ
అయిపోయింది.

ఫ్రిజల్ హతాశయుడయ్యాడు. కానీ చేసేది ఏమీ
లేక, "పోయిందేదో పోయింది," అనుకున్నాడు.

ఇప్పుడు వెన్న చిలకాలి. పెద్ద కొయ్య గొట్టంలోకి మీగడంతా తీసుకున్నాడు. దానిని తీసుకుని చెట్టు కిందకి వెళ్లాడు. గుత్తి కవ్వంతో వెన్న చిలకటం మొదలుపెట్టాడు. పక్కనే కూతురు కందిలి ఆడుకుంటోంది.

ఆకాశం నీలంగా ఉంది. పూల మొక్కల మీద, గడ్డి మీద లేత ఎండ ప్రకాశిస్తోంది.

''వాతావరణం బాగుంది,'' ఫ్రిజల్ అనుకున్నాడు. ''ఇందాక పరిగెత్తి అలసిపోయాను, ఇప్పుడు కాస్త సేదదీరతాను!



అరే, ఆవు సంగతి మరిచిపోయానే?
పాపం, పొద్దున నుంచి అది మేత, నీళ్లు
లేక అల్లాడుతూ ఉంది!”



బక్కెటులో నీళ్లు తీసుకుని ఆవు దగ్గరకు
పరిగెత్తాడు ఫ్రిజల్. పాపం, ఆవు.
దప్పికతో అల్లాడుతూ ఉంది. దాని నోరు
పిడచ కట్టుకు పోయి ఉంది.



ఆవు ఆకలిగా కూడా ఉంది.
అందుకే ఫ్రిజల్ దానిని
మైదానంలోకి తీసుకుని
వెళదామని అనుకున్నాడు.

కానీ ఆవుని దూరంగా తీసుకుని వెళితే ఇంటి దగ్గర కందిలిని ఎవరు చూస్తారు?

ఇంటి కప్పు మీదే చాలా పచ్చగడ్డి ఉంది. కాబట్టి ఆవుని అక్కడే మేపితే సరిపోతుంది.

ఆవుని ఇంటి కప్పు మీదకి ఎక్కించటం ఏమంత కష్టం కాలేదు.



ఫ్రిజల్ ఇల్లు చిన్న గుట్ట పక్కన ఉంది. ఆ గుట్ట
మీద నుంచి ఆవుని ఇంటి కప్పు మీదకి
ఎక్కించటం ఏమంత కష్టం కాలేదు.

అక్కడ లేత గడ్డి చూసి ఆవు కూడా సంతోషించింది. దాంతో ఫ్రిజల్ వెన్న చిలికే పని పూర్తి చెయ్యటానికి ఇంటికి తిరిగి వచ్చాడు.



అక్కడ అతడి కూతురు కొయ్య
గొట్టంలోకి తొంగి చూసే ప్రయత్నం
చేస్తోంది!



కానీ కొయ్య గొట్టం పడిపోయింది!



కందిలి ఒంటి మీద, నేల మీద మీగడ ఒలికిపోయింది!



“మీగడ అంతా వృధా అయిపోయింది,”

అనుకున్నాడు ఫ్రిజల్. కాసేపు కళ్లు మిటకరించి చూశాడు. తరవాత భూజాలు విరిచి,

“జరిగిందేదో జరిగింది, దానిని ఇక మరిచిపో,”

అనుకున్నాడు.

కందిలిని పక్కకి తీసి ఆరటానికి ఎండలో కూర్చో పెట్టాడు. కానీ ఆపాటికి సూర్యుడు పైకి బారెడు ఎగబాకాడు. ఇంకొంచెం సేపట్లో భార్య లిజీ అన్నానికి ఇంటికి వస్తుంది.

పెరటి తోటలోకి వెళ్లి ఉల్లిపాయ, బంగాళా దుంప, బీట్‌రూట్ వంటివి తవ్వి తీసుకున్నాడు.

"అన్ని కూరగాయలు కొంచెం కొంచెం వేస్తే చారు అద్భుతంగా ఉంటుంది," అనుకున్నాడు ఫ్రిజల్. చేతుల నిండా కూరగాయలు ఉండటంతో పెరటి తోట దడి వెయ్యటం మరిచిపోయాడు.



వంటింటిలో కూర్చుని

కూరగాయల తొక్కలు చెక్కసాగాడు.



అంతలో పైనుంచి వస్తున్న శబ్దం విని
ఫ్రిజల్ ఎగిరిపడ్డాడు.
"ఆవు కిందకి జారి పడిందంటే దాని మెడ
విరుగుతుంది!" అనుకున్నాడు.

ఫ్రిజల్ ఒక లావుపాటి తాడు తీసుకుని ఇంటి కప్పు పైకి వెళ్లాడు. ఆ తాడుని ఆవుకి కట్టేశాడు. రెండవ కొసని పొగ గొట్టంలోంచి కిందకి వదిలాడు. తరవాత ఇంటిలోకి వచ్చి తాడు రెండవ కొసని అందుకున్నాడు.

అప్పుడు ఏం చేశాడని అనుకున్నారు? తాడు రెండవ కొసని తన నడుముకి కట్టేసుకున్నాడు.

"ఆవు మెడ విరుగుతుందన్న భయం ఇక లేదు!" అనుకున్నాడు ఫ్రిజల్.



ఈల వేస్తూ తన పని మళ్లీ

మొదలుపెట్టాడు.





పొయ్యిలో కట్టెలు పెట్టి దాని మీద ఒక పెద్ద కుండ ఉంచాడు. దాంట్లో నీళ్లు పోశాడు.

"చివరికి అన్నీ కుదురుకున్నాయి!" అనుకున్నాడు ఫ్రిజల్. "కొంచెం సేపటిలో చక్కటి చారు తయారు అవుతుంది!"



"ఇప్పుడు కుండలో కూరలు వేస్తాను."

ఫ్రిజల్ అలాగే చేశాడు.

"ఇప్పుడు ఉప్పు, మసాలా దినుసులు వెయ్యాలి."

ఫ్రిజల్ అలాగే చేశాడు.

"ఇప్పుడు పొయ్యి వెలిగించాలి."

కానీ ఆ పని అతడు పూర్తి చెయ్య
లేకపోయాడు. ఇంటి పైకప్పు మీద
నుంచి ఆవు కిందకి జారిపోయింది.
దానికి కట్టిన తాడు రెండో వైపు ఫ్రిజల్
నడుముకి కట్టి ఉండటంతో అతడు పొగ
గొట్టంలో ఇరుక్కుపోయాడు. పాపం,
ఫ్రిజల్!
అతడు అలా గాలిలో వేలాడుతూ
ఉన్నాడు.



మధ్యాహ్నం భోజనం చెయ్యటానికి లిజీ
ఇంటికి వస్తోంది. ఆమె ఒక చేతిలో నీటి
బుర్ర, మరొక చేతిలో కొడవలి
ఉన్నాయి.

అరే! ఇంటికప్పు నుంచి ఏమిటి
వేలాడుతోంది? ఆవా? అవును, ఆవే. అది
నాలుక వేలాడదీసి చనిపోయేటట్టుగా ఉంది.

ఒక్క క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా
చేతిలోని కొడవలితో ఆవుకి ఉన్న తాడుని
కోసేసింది లిజీ. ఆవు కింద పడి, లేచి
నిలబడింది. హమ్మయ్య అది ప్రాణాలతో
బయటపడింది. దేవుడు చల్లగా చూశాడు!



అప్పుడు పెరటి తోట దడి తీసి
ఉండటం చూసింది లిజీ. మేకలు,
పందులు, బాతులు తోటలోకి వెళ్లి
పొట్ట నిండా మొత్తం తినేశాయి.
తోటలో ఒక్క మొక్క కూడా
మిగలలేదు!



మరొక అడుగు వేసిన లిజీకి ఏమి
కనపడింది? వెన్న చిలికే కొయ్య గొట్టం కింద
పడిపోయి ఉంది. కందిలి వంటి నిండా మీగడ
అంటుకుని ఉంది.



మరొక అడుగు వేసింది లిజీ. పొట్ట నిండా పకోడీలు తిన్న స్పిట్జ్ పొట్ట చెడింది, అది కిందపడి దొర్లుతోంది.



నేలమాళిగలోకి చూసిన లిజీకి

సారాయి అంతా నేలపాలై

కనిపించింది.



వంటింటిలోకి వెళ్లిన లిజీకి కూరగాయల

పొట్టు నేల మీదంతా పడి ఉండటం

కనిపించింది.

చివరిగా లిజీ చూపు పొయ్యి మీదకి
వెళ్లింది. అరే! చారు కాసే కుండలో
ఏమిటది? రెండు చేతులు, కాళ్లూ
తపాతపా కొట్టుకుంటున్నాయి ఏమిటి!

“ఏమయ్యింది?” అంటూ అరుస్తూ లిజీ ముందుకు పరిగెత్తింది. ఆవును కాపాడటానికి దానికి ఉన్న తాడును కోసేసినప్పుడు దానికి రెండో వైపున తన భర్త  ఉన్నాడన్న సంగతి ఆమెకి తెలియదు. తాడు తెగిపోవటంతో అతడు జారి కుండలో పడ్డాడు.

చేతులు పట్టుకుని కుండలోంచి భర్తని బయటకి తీసింది లిజీ. అతడి తల నిండా కూరగాయ ముక్కలు పట్టుకుని ఉన్నాయి.



ఫ్రిజల్ ప్రాణాలతో బయటపడ్డాడు.
కానీ ఇల్లంతా గందరగోళంగా
తయారయ్యింది!

“ఫ్రిజల్! ఇంటి పనులు చేసేది ఇలాగానే?” లిజీ అడిగింది.

“లిజీ!” ఫ్రిజల్ మొత్తుకున్నాడు, “నువ్వు చెప్పిందే నిజం – ఇంటి పని చెయ్యటం చాలా కష్టం!”

“మొదట్లో ఏ పనైనా కష్టం అనిపిస్తుంది,” లిజీ చెప్పింది, “తరవాత అదే అలవాటు అయిపోతుంది. రేపు నువ్వే చూస్తావుగా.”

“లేదు! లేదు!” ఫ్రిజల్ అరిచాడు. “జరిగిందేదో జరిగింది. ఇంటి పని ఇక నా వల్ల కాదు! మళ్లీ నేను పొలం పనికే వెళతాను, లిజీ. నీ పని కంటే నా పని కష్టమైనదని ఇక ఎప్పుడూ అనను!”

“సరే, ఫ్రిజల్,” లిజీ ఒప్పుకుంది, “నీకు
నిజంగానే అలా అనిపిస్తే ఇక మీదట
మనం హాయిగా ఉండవచ్చు.”

ఆ తరవాత వాళ్లు సంతోషంగా ఉన్నారు.



